## —: 3వ అధ్యాయతాత్పర్యము :—

"శ్లో॥ యజ్ఞాద్యం వర్ణధర్మోచిత మపి నియతం కర్మ శర్మప్రదం స్యా,
న్నత్యాజ్యం కార్య మేత ద్విగుణమపి యతో౽కర్మణః కర్మ శస్తం।
జీవ న్మర్త్యః కదాచి త్కరచరణయుతో నైవ తిష్ఠ త్యకర్మా,
తస్మా చ్ఛ్రేయా న్స్వధర్మో యదుపతిగదిత శ్చిత్తశుద్ధ్యై తృతీయే ॥"

వర్ణాశ్రమవిహితము, నియతము నగు యజ్ఞయాగాదికర్మము సుఖము నిచ్చును. అట్టి నిత్యనైమిత్తికకర్మ మెన్నఁడును విడువకూడదు. ఎందువల ననిన? అకర్మముకంటె స్వధర్మమగు నిత్యనైమిత్తికకర్మము రెట్టింపు ప్రశస్తమైనది. మనుజుఁడు బ్రతికియుండగ కరచరణములతోఁ గూడినవాఁడై యెన్నఁడును కర్మను చేయనివాఁడై యుండఁడు. కాన శ్రేయస్కరమగు స్వధర్మము శ్రీకృష్ణపరమాత్మచే చిత్తశుద్ధికొరకు తృతీయాధ్యాయమునందుఁ జెప్పఁబడెను.

నీలకంఠీయము:— ఇట్టి యోగమునకు ఫలమును "ఏవం" అను శ్లోకముచే బోధించుచుండెను. హార్దాకాశమునందుఁ గూడ హార్దాకాశస్థితమగు నిత్యకామములను కోరునట్టి మనస్సును బుద్ధిచే వృత్తిరహిత మొనరించి బుద్ధికంటె పరమగు పరమాత్మను తెలిసికొని సమూలఘాతకుఁడగు కామరూపశత్రువును నశింపఁజేయుము. ఇట "మహాబాహో!" అని యర్జునుని సంబోధించుటచే శత్రువినాశమందు నీకు సామర్థ్యముకల దని సూచింపఁబడెను. అనఁగా నెంతవరకు కామమూలమగు నజ్ఞానము వినాశ మొనరింపఁబడదో అంతవరకుఁ గామునకు మూలోచ్ఛేదము కానేరదు. కాన బుద్ధికంటె పరుఁడగు పరమాత్మను తెలిసికొనియే గాముఁడు నశింపఁజేయదగినవాఁడు. కాముడు నశించినచో సంసారరూపానర్థము నశించును. ఈకాముఁడు దురాసదుఁడు. అనఁగా నాత్మజ్ఞానము లేనిదే కష్టముచేనైన నీకాముఁడు నశింపఁజేయుటకు శక్యము కానివాఁడు.

"ఉపాయః కర్మనిష్ఠాత్ర ప్రాధాన్యే నోపసంహృతా। ఉపేయా జ్ఞాననిష్ఠా తు తద్గుణత్వేన కీర్తితా ॥" ఈయధ్యాయమునందు జ్ఞాననిష్ఠ కుపాయమగు కర్మనిష్ఠ ప్రధానముగను, నుపేయమగు జ్ఞాననిష్ఠ యప్రధానముగను జెప్పఁబడెను. ॥౪౩॥

ఇట్లు శ్రీభగవద్గీతాతృతీయాధ్యాయవ్యాఖ్యావిశేషములు ముగిసెను.

హరిః ఓమ్ తత్సత్ । శ్రీ శ్రీ శ్రీ

